మందిరమును గాంచీపురి
నంది వియద్బిందునాదతాంచిత యొండో
నిందురవి మండలస్తని
సుందరి నాయెడదఁ నెపుడు శోభిలుఁదుష్టిన్ 52

ఇంచుం దీపెకు నీడై
సంచు న్గంపాతటాన సతమందెడు సి
ద్ధాంచద్భైషజ్యము నోం
డుంచెద నెద దుర్భవజ్వరోద్ధతి నార్పన్ 53

మదనార్యుర స్సుపీఠిక
కుఁ దెలియనో చనులగట్టి కుదిరిక గల యా
మదన బ్రహ్మ సుతత్త్వా
స్పద నానంగద భజింతు భక్తి సతంబున్ 54

విలుఁ బాశము నంకుశము
న్నలిఁ గరములఁ దాల్చి స్వయ మెలర్చెడురీతు
ల్గల యాగమ సిద్ధాంతము
సులలితమా గాంచి శంభు శుద్ధాంతమహో ! 55

ఆ బ్రహ్మస్తంబంబో
నబ్రపు శిల్పంపు రచన నలరిన యాద్యం
బో బ్రహ్మవిద్య నతుల న
దభ్ర న్భావింతుఁ గాంచి కాంతర సంస్థన్ 56

శ్రీకామాక్షి ! నిను క్షణ
మేకాగ్రతఁ దలఁచు నాతఁ డిల మూఁగయు న
స్తోకపు దుర్గతి శోకియు
లోకోత్తర కీర్తియై విలోకింపఁ బడున్ 57

పంచదశ వర్ణ రూపము
నంచితము న్గాంచికా విహార చతురమున్
బంచ శరీయము శంకర
వంచనఁ బాండిత్య యుతము వాసి భజింతున్ 58

సుమతులదా సౌఖ్యమ్మా
ఖ్యముఁ దెరువుంబూని నాలుగా రీతుల మా
ర్పు మొనసి యేఁబదియా వ
ర్ణములఁ గృత పద శిల్పఁ గామ నయన భజింతున్ 59

ఆది క్షాంతాక్షర రూ
పోదార న్విద్యఁగా గురూత్తములని రా
స్వాదిష్ఠ చాప దండను
నేదిష్ఠ న్నామకోటి నిష్ఠనె నాకున్ 60

స్వాసనయు హార్షితస్మర
శాసనయు న్సర్వలోకచయ భాసనయున్
శ్రీసత్కాంచ్యాసన య
వ్యాసనుఁడు న్గలితశంబ రాసన ముదమున్ 61

ప్రేమము కంపపయి న్స్న
స్థేమము యతి చేతములను శిరమున సోముఁ
సామము నిత్యోక్తులఁ దగ
భూమంబున హైమవతియుఁ బొలిచెడు నెపుడున్ 62

కౌతుకముఁ గంప యెడఁ దగి
చేతస్సంజాతకలిత చేతము తోడఁ
ఖ్యాత మహాకుల దేవత
చేత న్నామ్ర ప్రతిభ విచ్చి చెలఁగుత సతముఁ 63

చూత తరుమూల ధారుణి
వాతహిత తిలకుఁడగు నొక వయసు మగనితో
బాతిగఁ గలసిన మెయితోఁ
బ్రీతి న్సంవిత్స్వరూప వెలసి రమించుఁ 64

కాంచీ దేశగతంబయి
పంచాశుగ గర్వలక్ష్మి వాసం బెసఁగున్
గాంచి యెటో హృత్పేటిక
నుంచి పదిలపఱచితిని మహోత్తమము మణిఁ 65

కోరి భజించెద నుమ! నీ
కారుణ్యము దరవికసిత కౌసుంభ సమా
నారుణ్యము దగ్ధషడ
ధ్వారణ్యముఁ గంప నెసఁగు తారుణ్యంబుఁ 66

అనుపమతఁ గాంచిఁ బెరిఁగెడు
ననవరతానందపాక మదియొకఁ డరుణ
త్వ నితాంతగర్వ పల్లవి
తను దానిం గనుల విందుఁ దగఁ గావింతున్ 67

బాణ సృణిపాశ ధనువులఁ
బాణులఁగొని కామకోటి భాసురమై బా
లైణధర శోణవహామహా
శోణిమ పరిపాక మొందు శోభిలుత నెదన్ 68

బింబాధరమును దరహా
సంబది చుంబింపఁ గర మెసంగు ముఖసరో
జంబు గల యంబ యంహ
స్సంబాధక యెదరహించెఁ జాల్కృతి నైతిన్ 69

శివ శ్రీకామాక్షి సదా
శివమయవహా పరశివ మయ శృంగార సుమహా
ఘు విపుల పర్యంకము నం
దు విరాజిలుఁ జక్రమందుఁ దోరపుసిరితోన్ 70

ఏలఁబడఁ దగుదుఁ గాంచీ
పాలికచే శ్రుతి సతీ శుభకరాలక స
న్మాలికచే భూరి కృపా
స్థాలికచేఁ దుహినశైల సద్బాలికచేన్ 71

మాయా ! పురత్రియాంతక
జాయా! కాంచ్యాశ్రియా ! యజస్ర పృథు కృపా
మేయా ! యార్తిహగంబా
నీ యమగుందమ్మ లీన నియతి వసింతున్ 72

జౌ దల విరిఁగఁ జకోరా
మోదక సామ్రాజ్యమూని ముక్త్యంచిత భ
వ్యోదార మూర్తిఁ గంపా
మోదిని యా నంబ యెడఁద ముదము నినుచుతన్ 73

నియతిని మ్రొక్కెద నే శ్రుతి
మయికి న్నశి బిందు నాదమయికిఁ బరపదా
ద్వయికి న్ప్రకృతి మయికి న
నయమును మను యంత్ర తంత్ర నామమయికినిన్ 74

అనిశము విహరించుత నా
మనమునఁ దాఁ గామకోటి మహిత సుకవి సూ
క్తి నిచయ రసధాటి కృపా
ఘన పాకీయ పరిపాటి కరము వఱలుచున్ 75

కుటిలముఁ గచములఁ గన్నులఁ
జటులముఁ బృథులంబు రమ్య జఘనంబులఁ బ
త్తటముల మృదులతఁ గంపా
తటగముఁ బ్రకు తేజముఁ గని తగ భజియింతున్ 76

శ్రీకామ నయనదాన
స్తోకంబు ప్రసాద దీప సుద్యుతిఁ బ్రత్య
క్సాకల్య దృష్టిఁ బక్వా
స్తోక పరశివోల్లసనముఁ జూతు నతుఁడముక్ 77

నిను బ్రహ్మ విషయఁ గాత్మ్యా
యని భైరవి వింధ్యఁ గాళి నాదిమను గల
న్వినుతింతుఁ గామకోటి శి
వను భారతి శాకిని స్సుభద్ర శివ సతిన్ 78

కేలు మొగిడ్చెద సురజన
పాలినికి న్వ్యాలినికిఁ గపాలినికి మహే
ట్పాలిని కరికాలినికి సు
మాలినికి న్గాంచి విద్రుమ సుశాలినికిన్ 79

కామాక్షీ కామ నిగమము
నాముక్కంటికిని నేర్ప నగు నొజ్జ యిదా
నేమో ! తావక తాదృ
క్కోమల తారుణ్య గరిమ కుధరేట్తనయా ! 80

ఏనుఁగు గుబ్బల యుబ్బున
కూనత నొనరించు చనుల యురుత కొరగులేఁ
గానెసఁగ శివుని కనులకుఁ
దేనియ జడిమైన యరుణ దీప్తి కెఱఁగెదన్ 81

కాంచితిఁ గాంచినిఁ బురమణి
కాంచనమయ కాంచిఁ దగు నొకానొక సంచున్
మంచి దయ నతుల యెడఁ బరఁ
గించుచుఁ గంపదరి మమ్మొగి న్మనుపంగన్ 82

పరమశివు కురువునకు నా
భరణంబు న్మలలతేని ప్రథిత శ్రీయో
త్కరసన్నాహముఁ గంపా
పరిసరగముఁ గాంతు వెల్గుఁ బరమ గురు కృపన్ 83

అమ్మా ! తారుణ్య రమా
యమ్మా చాతుర్య గరిమ మమ్మదనుని భ
స్మమ్ముగఁ జేసిన హరు చొ
క్కమ్మగు నా బ్రహ్మచర్య ఘనత న్గలఁచుణ్ 84

కట్టి మొల నాకులను గయిఁ
బట్టి ఖనిత్రింబు మదకబంధ దళాలణ్
బెట్టి ఫణులెసఁగ వేషము
బెట్టు గురింజ నగల చెంచు వెలఁదికి జోతల్ 85

కురువునఁ గీర మెసఁగ బరి
సరమందు న్నైభరవీ వ్రజమును సుగాయ
న్యరు మండలి తగ వీనుల
దర కుండలములు సెలంగఁ దనరెద వంబా ! 86

భర్గుని మెప్పింపఁగ రణ
సర్గము నొనరించి సింహ సంసర్గవునై
దుర్గతులనొంచి కృప నప
వర్గము దుర్గవయి భక్త వరుల కిడెదుగా 87

భండనమున నుద్దండయు
ముండ లసత్కారయు నాంత్రిపుంజ ధరయు వే
దండ చలన కృచ్ఛ్రివ చా
ముండ ధృతాసుర శిఖండ వోలఁగ నీవే 88

అన్నంబునఁ జెన్నగు మే
ల్సొన్నపు గరిటెఁ గొని దాన స్ఫూర్జ ద్దయచే
మిన్నయగు లేమినా వెతఁ
గ్రిన్నన మర్రిందింతు వీవె కామాక్షి ! మహీశా 89

కొట్టఁబడు వైరుల న్వెతఁ
బెట్టి గెడప దశములగు పృథుహాల ముసలా
ల్పట్టి వరాహాననవై
గట్టిగఁ గ్రీడింతు వీవెకా కామాక్షీ ! 90

పొన్నంపుఁ జెన్నుఁగొను మెఱు
వన్నెం దగి తమ్మిదండ వఱలఁగఁ గయి ము
క్కన్నుల వేలుపు వలచు ర
తి న్నగడెదు బాలవా రతిప మణిగేహా ! 91

స్మరమథన వరణ లోలవు
కరాబ్జధృత మాలవు కనక ద్యుతిచయ త
స్కర శీలవు మన్మథ వి
స్ఫుర ద్విలాసమణిశాలవు జగజ్జననీ ! 91

కమలకుటి నమల పటిపై
యమరిచి కచ్ఛపిని నొడి శయాంబుజములఁ బొ
త్తము నక్షమాల తగఁ జప
లము లక్షులఁ జెలఁగు నలువ లలనవు తల్లీ! 92

అమ్మా ! కుంకుమరుచిపిం
గమ్మౌ నసృక్పంకముగ్ధ కాలాళి విభా
త మ్మొనయు జయము నీరూ
ప మ్మభయ పటీవరద జపకృతి కరమ్మై. 93

పసిఁడిరతనాల మేల్నగ
వెసఁగ న్గాలాయసంపు టెలమిగెలుచు మై
మిసిమిఁదగునిన్నుఁ గరసా
రసగకపాలత్రిశూల రహిఁగొల్తు సుమా! 94

కొందఱుపుణ్యాత్ములు తమ
డెందముచేఁగాంచెదరు పటీయారుణిమా
మందంపు రాశి నీమో
మందముఁజనుదోయిఁగాంచి నమ్మ! మహింతమున్ 95

నాలుగు నాఱును బది యు
న్నాలుగుఁ బదునాఱు రెండు నాఱెంపుదళా
ల్కాఱ్రిలు కమలాలచే గిరి
బాలా ! పొందెదు సహస్ర పత్ర కమలముఁ గా

అంబా ! కొందఱు గురు చర
ణంబులఁ బూజించి నీఘనకరుణ నపవ
ర్గంబనెడు మేడనుం దభ్రభ
యంబుగ బీజయుగబీజమా యోగమునఁ గా

జంతుతతిలోన వెలి నీ
వంతకసంహారుసహాంత వానమ్మరో ! రా
ణింతువు భజించు భక్తుల
కెంతయు మహిమమ్ముఁగూర్చు చెప్ప మహేశీ !

కలమంజూక్తులచే రా
చిలుక న్గళపంజరగముఁ జింతించి గ్రహిం
ప లతాంతాస్త్రిం డెరఁగా
నిలిపిన బింబఫల మంబ ! నీయధరమహో

జయమగుత శంకర ప్రియ
దయితా ! జగదంబ ! శీతధరరాట్తనయా !
జయము శివా ! కామాక్షీ
జయము చిదాకాశ ! చంద్ర సచ్చవిహారా !

సత్సంతాన ప్రిసూ్ప
క్షత్సదనా ! మృదుమధూక్తి రాజత్కవితా
వత్సంచయమూర్ధన్య ! సు
వాత్సల్యేక్షితసుశిష్య వార ! గురువరా !

కంద, గీత గర్భితోత్పలమాల

ధీచతురాగ్రిణీ ! బుధవిధేయ ! తులాతిగపుణ్యభాసి !య
చ్ఛాచరణా ! లసద్గుణచయామల రత్నసుకోశభూత ! వి
ద్యాచతురాస్య ! సత్కవినుతప్రతిభాకర ! కావ్యకారి ! భా
గ్యోచితధీక ! సన్నిగమ యూధసమాదర ! నిర్మలాత్మకా !

పై పద్యమునందలి కందము.

చతురాగ్రిణీ ! బుధవిధే
య ! తులాధికపుణ్యభాసి ! యచ్ఛాచరణా !
చతురాస్య! సత్కవినుత
ప్రతిభాకర ! కావ్యకారి ! భాగ్యోచితధీ !

పయి యుత్పలమాలయందలి గీతము.

బుధవిధేయ ! తులాతిగ పుణ్యభాసి !
గుణచయామల రత్నసుకోశభూత !
కవినుతప్రతిభాకర ! కావ్యకారి !
నిగమయూధసమాదర ! నిర్మలాత్మ !

పూరుషోత్తమసత్కవీశ్వరపుత్త్ర ! యత్రితనూజప
స్వైరజానిశపూజనాదర ! నిర్మలాంతరభాసురా !
సూరిసత్తమశస్యభవ్య యశోవిభాసిదిశాంతరా !
నారుణీసురవంశ్య ! నాదెళ దక్షిణాస్య ! గురూత్తమా !

గద్యము.

ఇది శ్రీమచ్ఛంకర సద్గురు కరుణా సమాసాదిత సరస కవితా
విభాస్వర, ప్రవర్ధమాన శ్రీమ ద్భమిడిపాట్యన్వయ పయః
పారావార రాకా సుధాకర, శ్రీమచ్ఛాండిల్యస గోత్ర
పవిత్ర, సంతతాగ్నిహోత్ర పరిచర్యోపాత్త ఘన
తర సద్వైదుషీవిరాజమాన పేర సోమయాజి
పౌత్ర, బుధజనసంభావ్య సచ్ఛేముషీకలిత
వేంకటాచలపతిసుధీతనూభవ నైరంతర్య
భక్తిసంభావితభవానీ ధవ విబుధ
జనవిధేయ వేంకటసుబ్రహ్మణ్య
శర్మాభిధేయాంధ్రీకృతం బైన
శ్రీకామాక్షీ స్తుతి యం
దలి యార్యాస్తుతి
శతకము సర్వము
సంపూర్ణము.

శ్రీ మేధా దక్షిణామూర్తి సద్గురు వరార్పితము.

శ్రీ మేధా దక్షిణామూర్తి సద్గురవేనమః

శ్రీ గురుదత్త సౌధమున 23-8-59 భ. వేం. సు. షష్టిపూర్తిని

శ్రీ నాదెళ్ల మేధా దక్షిణామూర్తిశాస్త్రిగారి ఆశీస్సు

శ్లో॥ వికారి శ్రావణే మాసే పంచమ్యాం రవివాసరే
షష్టిపూర్తి మహాప్రాప్తి స్సుబ్రహ్మణ్యాయ కీర్తిదా

శ్లో॥ శ్రుత్యుక్తాయు ర్విధి ర్దద్యాత్-శ్రీమత్తా పురుషోత్తమః
కామాక్షీపతి రైశ్వర్యం-భోగం తథా శచీధవః

ఉ॥ శ్రీగురుదత్త సౌధమునఁజేరిన యీవిబుధాగ్రిణుల్ కవుల్
వాగురు లాయురర్థసుతపౌత్త్రి సుఖప్రద జీవనంబులన్
బాగుగఁజేయ మాభమిడిపాటికులీనుని సుబ్బరాయనిన్
సాగెడుఁగాత నీతనివచః ప్రచయంబు స్వతంత్రశక్తికిన్

మ॥ కవులన్యజ్వగఁజేర్మి తిక్కన కెదక్కన్ యాయజూకాన్వయుం
డవనిందానయివాక్క్రియాకలనమందాంధ్రీకృతుల్ ప్రౌఢ కా
వ్యవరేణ్యమ్ము లనేక ముల్నలిపి సుబ్రహ్మణ్యుఁడుంగీర్తిఁ గాం
చు వరిష్ఠుండు స్వతంత్రకావ్యముల మచ్చుంజూప దీవించెదన్

శా॥ ఆయుస్సంపద వన్నె కెక్కనిలలో నారోగ్యభాగ్యంబుతో
డై యున్నంగద షష్టిపూర్తికిఁబయిన్ హర్షప్రదంబట్లు వై
కాయంబందలిపాటవంబున నెసంగన్ బుద్ధివైశద్యముం
జేయున్ శ్రీసకలేశ్వరప్రియ కృతిశ్రేష్ఠంబులన్నిల్వఁగాన్

---

## కృతిసమర్పణాశీ రభినందనములు

శ్రీ గాయత్రీ పీఠాధిప శ్రీ విద్యాశంకర భారతీ స్వాములవారు

శ్లో॥ కృతికర్తా సుబ్రహ్మణ్యః-శాంతో విద్వత్కవీశ్వరః
విద్యావినయ సంపన్నః - తదన్వయ సుదీపకః.

శ్లో॥ తాదృశోయం సుబ్రహ్మణ్యః - షష్ట్యబ్దానాంచ పూరణే
భూయశ్చ సుష్టు బ్రహ్మణ్యః - శ్రీ కామాక్షీ ప్రసాదతః.

శ్లో॥ బ్రహ్మణ్యం కృతికర్తారం - తద్భర్తారం కవీశ్వరం
దక్షిణామూర్తి విద్వాంసం - గాయత్రీ పాతు సర్వదా.

'విద్వత్కవిసార్వభౌమ' శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు

శ్లో॥ సాక్షాచ్ఛ్రీకామాక్షీ కరుణామృత వీటికారసాస్వాదాత్
సకలకలా రససారం 'స్తుతి'కవితా కల్పలతికాయాం యః

శ్లో॥ నిక్షిప్య మూకతాం స్వాం పరకవికల్పేషు జగతి సన్ధాయ్య
అత్యద్భుత రసపూర్ణ ప్రసూనమాలా మపుష్పయత్తు
పంచశతకలితామ్

శ్లో॥ సకలకవీనామ్ సమ్రాజేత స్మైమూకాయ మేనమాంసి స్యుః
తత్ర విపంచశత స్తుతిమాంధ్రసుబోధాయ నిశితధీసాహ్యాత్

శ్లో॥ వేంకట సుబ్రహ్మణ్యసుధీ రన్వవద స్మాతృకానుగత పద్యైః
అతికృచ్ఛకార్య మేత త్సహృదయహృదయానుకర్షి సన్ధానమ్

శ్లో॥ ప్రవిధాయ ధన్యజన్మా మాన్యః కవిరేష సత్ప్రబంధకరః।
ఏష విశేష ఇహార్యా శ్రీకామాక్షీ స్తుతి గ్రహీ తాయమ్॥

శ్లో॥ సకలకలా రసవేదీ శ్రీమేధా దక్షిణామూర్తి బుధరాజ
శ్శిష్యస్య షష్టిసమయే సత్కృతికన్యామ్ సమగ్రహీజ్జీయాత్॥

శ్లో॥ కృతికర్తృ స్వీకర్త్రో రిహ గురుశిష్యత్వే బుధప్రమోదాస్తే
శ్రీవాణీ కరుణాభర ఉభయో రఖిలార్థదో భూయాత్ ॥

శ్లో॥ అభినవ పండితరాజా ద్యభిరూప సభా ప్తబిరుదదశకోఽసౌ
స ఉమామహేశ్వరసుధీ ర్విద్వత్కవి సార్వభౌమ ఇతివష్టి॥

"కలాప్రపూర్ణ" శ్రీ వఝుల చినసీతారామస్వామి శాస్త్రిగారు

"కామాక్షీ స్తు" త్యాంధ్రకృతిచే బ్రహ్మశ్రీ భమిడి పాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మ కవిపుంగవులు సంస్కృతాంధ్ర భాషా వాఙ్మయపాండిత్యవైభవు, లాచంద్రతారార్కముగఁ బండితకవుల నానంద పరవశులఁ జేయుదురుగాక !

వీరు స్వతంత్రకథాకలిత ప్రబంధరాజముల రచించి యితోధికముగాఁ బండితకవుల బ్రహ్మానందాబ్ధి నోలలాడింతురు గాక !

ప్రబంధ భర్తలగు "పండితకవి శ్రేష్ఠులు" బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రులవారిట్లే తమ ప్రబంధ భర్తృత్వముచేతను స్వతస్సిద్ధమగు మహాప్రబంధ కర్తృత్వము చేతను సదా తమయశస్సుల దశదిశలందు వెదఁజల్లుదురు గాత !

"అభినవ వాగనుశాసన" శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

క॥ కృతి కృతికృ త్కృతిపతి యో
గ్యతలను "మున్నుడి" యె చక్కఁగా వర్ణించెన్
కృతికన్యక "కామాక్షీ
స్తుతి" సుగుణ సువృత్త బుధనుతుల్ గొనుటరుదే!

క॥ గురుశిష్యులు విధివిహితా
చరణులు పండితులు కవులు సారస్వత సు
స్థిరమతు లల్లుఁడు మామయుఁ
బురుషాయుష మధిగమించి పొగడితఁ గనుఁడీ !

"అవధాని శిరోమణి" శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

క॥ కర్తయుఁ గృతియు న్భర్తయు
వర్తనమున టొంపులేని వారలు గానన్
కీర్తిలతా బాలికలన్
బూర్తిగ నల్లింత్రుగాత భూతలమందున్.

"శతావధాని" శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారు

క॥ ఎది గురువున కీవలెనో
యదియిచ్చి ఋణంబునీఁగి తదియుంగా కీ
యది బుధులకుఁ బ్రాఁజదువుల
సుధ కాదా? భమిడిపాటి సుబ్రహ్మణ్యా!

క॥ ఎది గురువు కోరుకొనునో !
అది సూటిగఁజూచి యిచ్చి తక్కజమగు నీ
మది దాన నిన్ను నీగురు
గుదిగుచ్చెద స్తోత్రసూత్ర కుసుమంబులుగన్

"మహామహోపాధ్యాయ" "కవిశేఖర" శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు

క॥ మూకకవి మాలమఁట లో
కైకజనని స్తోత్రమంట యభినవ సరళాం
ధ్రీకరణమంట ముద మ
స్తోకగుణా! భమిడిపాటి సుబ్రహ్మణ్యా!

మ॥ అవురా! సత్కవిరాజ తావకిని గామాక్షీనుతి న్సద్గుణన్
గవితాకన్యను లక్షణాంచిత నలంకారాభిరామన్ స్ఫుర
న్నవభావన్ మృదువాణిఁజారుగతి 'మేధాదక్షిణామూర్తిశా
స్త్రి'వరుండే వరియించెనన్న గుణముల్ చెప్పంగనింకేటికిన్

తే॥ ఆంధ్రులకు నిట్టి "స్తుతి" నుపహారమిడిన
మీకుఁ గవులార! యివె నమోవాకతతులు
పూజ్య యేకామ్రనాథుని పూవుఁబోఁడి
కంచికామాక్షి మిమ్ము రక్షించుఁగాత!

"విమర్శకాగ్రేసర" శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు-నెల్లూరు

తాము దయతోఁబంపిన "కామాక్షీస్తుతి" కృతి చదివి యానందించితిని. దేవీస్తుతి పరమును భక్తిరసభరితమును నగుట చేతనే పవిత్రమైన మీగ్రంథము శ్రీ గురుదేవ పదసమర్పిత మగుటచేత మఱింత పవిత్రతనుగాంచి మీయనువాద కౌశలముచేత సహృదయ హృదయరంజకమై యొప్పుచున్న దనుటలో సందేహము లేదు. అనువాదమయ్యును మీకవిత స్వతంత్రరచనవలెనే కమ్మగా జాలువాఱినది. అది మీమువంటి కృతహస్తులకే కాని సామాన్యులకు సాధ్యముగుపనికాదు.

మ॥ గురువర్యామితసత్ప్రసాదమది బాగుంగూర్ప సాహాయ్యమై
వఱలన్ సూక్ష్మముదుర్గమంబునగు నిర్వాణాధ్వమందే చరిం
చురహింబొల్చితివింక 'నార్య'కృపసంచుంగాంచి దివ్యద్యశో
భరముంబొందుట నీకు బ్రాఁతియె? సుబ్రహ్మణ్యవిద్వత్కవీ!

విజ్ఞాననిధీ! భావుకమైన భవదీయకావ్యము "విమర్శ కాగ్రేసర" "విద్వత్కవిశేఖర" యుష్మద్గురునాథ సమాదృత మును "ఉభయభాషాప్రవీణ" "కవిశేఖర" శ్రీ గురునాథ సంభావితమునై యుండగా ఇంక నితరుల యభినందనములెందులకు ? శ్రీ కామాక్షీ కరుణాకటాక్షమున మీ కృతి కృతీశ్వరునకును మీకును సంతతానంద సంధాయకమగునుగాక!

"సంగీతసాహిత్య కళానిధి" శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

తమ "శ్రీ కామాక్షీస్తుతి" అందినది. యథావకాశముగా అందందు చదివి చవిగొన్నాను. తెలిగింపు ధారాళమై తమ ఉభయభాషాపాండిత్యముఁ దెలుపుచున్నది. కొంత సంస్కృతభాషాభిరుచియే యెక్కువగా నున్నదనిపించును.

శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు- M. A.

ఆర్యా ! మీ "కామాక్షీస్తుతి" అక్కడక్కడ చదివి ఆనందించినాను. అనువాదము ఎంతో బాగున్నది.

ఈపవిత్రకావ్యమును రచించి గురువునకు కృతియిచ్చుచున్నందులకు మిమ్ము‌ను, కృతిని స్వీకరించుచున్నందులకు శ్రీ శ్రీ మేధా దక్షిణామూర్తిశాస్త్రిగారిని అభినందించుచున్నాను.

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, M. A.

మీ "కామాక్షీ స్తుతి" ని సాంతముగాఁజదివి మిక్కిలి యానందించితిని. మీకవిత్వము చక్కనిపాకమునఁబడినది. దీనినిగూర్చి యన్నివిధములఁ బ్రశంసింపవలెనన్న "మున్నుడి" లోని "...ఎంతధన్యుఁడవు సుబ్రహ్మణ్యవిద్వన్మణీ!" యున్నదే

వ్యాఖ్యానింతును:-మీషష్టిపూర్తి సందర్భమున మీకృతికన్య కిట్టిభర్తదొరకుటచే మీరు చాలధన్యులు. ఈఅరువదవపడిలో మాసోదరుఁడు "దక్షిణామూర్తిశాస్త్రి" కీకృతికన్యక దొరకుట, ఆమెనుజేపట్టుట కాతఁడంగీకరించుటచేత "నాదెళ్ల" వంశప్రశస్తి ప్రబలుటయుననునవి మిక్కిలిముదావహములు. ఇఁక కామాక్షీ కటాక్షావలోకనమున నీ "మేధా దక్షిణామూర్తి" స్వస్వరూపానుసంధాన ఫలప్రాప్తినంది జీవన్ముక్తుఁడగుంగాక !

కొవ్వూరు ఏ.జి.వి. పీఠము-ఎస్. వి. జె. వి. సంస్కృతకళాశాల ప్రధానాధ్యాపకులు, శ్రీ కె. వి. ఎన్. అప్పారావుగారు, M.A.,V.B.P;P.O.L.

శ్లో॥ "శ్రీ కామాక్షీ స్తుతి" రిహ కృతిః సర్వభద్రప్రదాత్రీ
స్వీకర్తాహి ప్రథితవిబుధో దక్షిణామూర్తిశాస్త్రీ
సుబ్రహ్మణ్యో గురుబుధ మపాకర్తు కామశ్చ కర్తా
ధన్యానూనం వరదగురుణాధ్యాసితా సత్సభేయమ్

'శతావధాని' శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారు

కం॥ కుతుకంబునఁ జదివితి మీ
కృతి సుబ్రహ్మణ్యశర్మ ! 'శ్రీమీనాక్షీ
స్తుతి' రసబంధుర కవితా
మృత కలశోపచితభక్తి మేదురఫణితిన్

కం॥ కృతియన బహులక్షణవతి
కృతిపతియన సుకవి బుధుఁడు కృతమతి గురుఁడా
తతకీర్తి దక్షిణామూ
ర్తి తపమ్ములు పండినవిగదే యిటు సుకవీ !

తే॥ భారతీవంశవర్ధనోదార సంప
దాయ మిటు శ్రోత్రియాచారతతముఁ జేయు
నంచితులు మీకు సిరియు దీర్ఘాయు వొసఁగి
మనుచుఁగావుత మెపుడు కామాక్షి దేవి !

'శతావధాని' శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి,
శ్రీ చెరువు సత్యనారాయణశాస్త్రిగార్లు

మ. అభినందించెద మర్హార్హతకు మేలౌఁగాత మంచాత్మమీ
యుభయుల్ శ్రేయమునుత్తరోత్తరముగానొందంగఁగాంక్షించియ
య్యభవుంగొల్చెద మిట్టిపట్ల నవుఁగాదా? సమ్మోదం బెంతయే
ని భవద్భావుకకాము కార్యతతికిన్ హృద్యానుభావస్థితిన్

కం॥ యాత్రికుఁ దగు వెర వెఱుఁగని
యత్రిత్యుఁడు నెట్లు కాంచనగు మిము మీ
ఛాత్రోపాధ్యాయిక కతి
మాత్రము దీర్ఘాయువుగఁ బ్రమాణింతు మహా !

మ॥ తవు నా దెండ్లకులాబ్ధిశీతగుఁడు మేధాదక్షిణామూర్తి శా
స్త్రవిదగ్ర్యుండు కృతింగొనంగఁదగు సుబ్రహ్మణ్యసంజ్ఞుండు శి
ష్యవరేణ్యుండదియౌఁదగుంగృతియు 'కామాక్షీస్తుతివ్యాఖ్య' రా
ఘవనారాయణుఁ డాకృతింజదివి యుద్ఘాటింప స్వాకూతమున్

కం॥ కృతికర్తకుఁ గృతిభర్తకుఁ
గృతికిం గృతకృత్యతల నొగిన్నమకూర్ప
న్మతి ధ్యానింతుము కరుణా
వతిఁ గామాక్షమ్మ సంస్తవప్రచితముగాన్

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు

కం॥ ఒంటిమావి ముక్కంటిని బంటుగాగ
నేలుకొను దేవి కామాక్షి మేలిచలువ
చూపు లీయాత్మవై భవస్తుతిని సాకు
గాత తత్కృతిభర్తతో కర్తతోడ

శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మ గారు.

కం॥ శ్రీమన్నాదెళ వంశ
స్వామీ! పురుషోత్త మాత్మజను రభిరామా !
శ్రీముక్తి కామినీసుత !
కామాక్షీస్తుతి మనోజ్ఞకవితాధిపతీ !

కం॥ హారితసగోత్రసముద్భవ
చిరత్న గుణరత్న సుకవిశేఖర సంభా
వ్య రుచిర మధుమధుర కవి
త్వరసాయన పాంథభావ పరిణతచిత్తా !

శా॥ శ్రీమత్పర్వత కన్యకాకుచతటీ శ్రీగంధ కాశ్మీర రే
ఖా మాంగళ్య మహామహోమహము లీకల్యాణసంశీలికిన్
శ్రీమదత్త గురుప్రభావకవికి న్నీకు న్సదాకూర్చుత
న్గామాక్షీస్తుతి జాగ్రదుజ్జ్వల కలాకల్యాణ సంపత్తులన్

సీ॥ శ్రోత్రియగ్రామణి సుకవిశిరోమణి
పండితమండలీ మండనుండు
జ్యోతిర్విదగ్రణి నీతివిద్యాఽరణి
సూనృతాచార విశుద్ధగుణుఁడు
గుప్తదానప్రీతి యాప్తగుణఖ్యాతి
నిజగురుభక్తి నిర్నిద్రవృత్తి

స్తుతివిముఖుఁడు గురుస్తుతిసదాసుముఖుండు
నాసిధారవ్రతాభ్యాసభాసి

తే॥ మునిగుణాఢ్యుండు దక్షిణామూర్తిశాస్త్రి
స్వీకరించుతఁ గృతులిట్లు శిష్యవృష్టి
పూర్తిమహముల గురుకృపా పూరపూర్ణ
నవసుధాస్వర్ణ కలశసంతతుల సతము

శ్లో॥ కృతికర్తాననుహిమవాన్ కృతిరేషాసర్వమంగళానూనమ్
కృతిపతి రసా చ సాక్షాత్ శ్రీమేధా దక్షిణామూర్తిః

శ్లో॥ జలధి రసా కృతిజనకః శ్రీరేషా కావ్యకన్యకా సాక్షాత్
పురుషోత్త మాత్మభూతిః కృతిపతి రిత్యఖిల మనురూపమ్

శ్లో॥ పురుషోత్తమాత్మజోఽసౌచతు రాస్యఃపతిరియంవధూర్వాణీ
గురుదత్త సౌధ మిదమపి బ్రహ్మసభై వాఽత్ర కించిత్రమ్

శ్లో॥ నూన మియంశ్రీకాంచీకామాక్షీస్తుతిరసార్ద్రసర్వాత్మ
యతాగ్రిధ్యక్ష శ్రీమాన్ వరద శ్రితభక్త జనవరదః

శ్లో॥ కృతికర్తా కృతిభర్తా కృతీచ కృతకృత్య ఏష ఆత్మజ్ఞః
జయతు చిరం ఫలితకృతి శ్రీకామాక్షీ కృపాసంగాత్

శ్లో॥ కామాక్షీమృదుపాదపద్మరుచయఃపద్మాప్తసద్బాంధవాః
తన్మంజీర ఘులంఘులాశ్శ్రుతి శిర స్సిద్ధాంతసంవాదినః
తత్ప్రియూష రసప్రసార విసరా మందాకినీ మాతగః
దేయాసుః కృతినాయకాయసకలాంసిద్ధించిరాఽభీప్సితామ్

శ్లో॥ కామాక్షీస్తుతి మంజరీమధురఝరీ గంగాతరంగశ్రియః
ప్రాచాంబ్రహ్మముఖాబ్జవాసితరుచాంవాచాంపరా దేవతాః

మూకస్యాఽపి మహాకవిత్వ విభవశ్రీదాన భూమాధవాః
భూయాసుః కృతిభర్తు రస్యభవనే సంతానసంపత్ప్రదాః॥

శ్లో॥ కామాక్షీ కరుణాకటాక్షలహరీ కృష్ణాఽకృతి స్ఫూర్తయః
పశ్యత్ఫాల మనస్త్రివిక్రమవృతి స్వర్ధారాళు మూర్తశ్రియః
మూకాంభోధి తరంగశీకరగణ ప్రద్యోతితాంబాఘృణాః
పాయాసుః కృతినాథ మేనమతులారోగ్యాయురర్థాన్వితమ్

శ్లో॥ కామాక్షీ రుచిరస్మితామృత రుచిప్రాగల్భ్య చంద్రాతపాః
కామదుర్ణ్మతి దుగ్ధవార్ధివిలస ల్లక్ష్మీమనః కాముకాః
విద్వన్మానస శారదోజ్జ్వల రమాః కల్యాణఘంటాపథాః
భూయాసుః కృతిభర్తు రస్య నిఖిలశ్రేయః ప్రదోద్యోగినః

శ్లో॥ కామాక్షీ నిజరూపదీప్తి విభవాః కల్యాణభావోద్భవాః
గైర్వాణీనవయౌవనాంతరధనాః మూకాత్మసంబోధనాః
ఆర్యార్థా రసభావరీతిమధురాః ధ్వన్యర్థ చారోద్ధురాః
దేయాసుః కృతినాయకాయపరమశ్రేయశ్చిరాయుర్ముదమ్

సీ॥ మాతండ్రి యొడను సౌభ్రాతృత్వమునఁగాక
యేకగోత్రోద్భూతి యెంచికాక
నిచ్చలునాకిచ్చు మెచ్చికోలునఁగాక
నైజమౌ వినయధనమునఁగాక
సాజమౌ పాండిత్య సంపన్నతనుగాక
సమయనిర్వాహణాత్తసరణిఁగాక
అతినిరాడంబరమ్మైనవర్తనఁగాక
సహజార్ద్ర సౌమనస్యమునఁ గాక

తే॥ జన్మ జన్మాంతర గోత్ర వాసనలబడిని
వెడలు నుడుగులు సంతోష మిడ వెనీకు
కృతిరమానాథ ! సతతదాక్షిణ్యమూర్తి !
దక్షిణామూర్తి ! విద్వ దధ్యక్షమూర్తి !

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు

బ్ర॥ భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్య శర్మగారు ఆంధ్రీ కరించిన "శ్రీ కామాక్షీ స్తుతి" చేరఁగాఁ గన్నులకద్దుకొని పారాయణము చేసికొంటిని. మూకమహాకవి మూలములోని మాధుర్యగాంభీర్యము లింతకుమించి తెనుఁగునకుఁ దెచ్చుట సాధ్యము కాదు. ఏతద్గ్రంథాంధ్రీకరణముతో దేవీపదారాధనము నెఱపి చరితార్థులైన శర్మగారికి నావందనములు తెలుపు కొనుచున్నాను.

బహుమహాగ్రంథకర్తలు, నిష్ఠాగరిష్ఠులు, మహోదారులు, విద్వత్కవిశేఖరులునౌ బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిలుగారు ఏతత్కృతికి స్వీకర్తలగుట "రత్నం సమాగచ్ఛతు కాంచనేన" అన్నట్టిది.

"మాఘపురాణా"ది కర్తలు శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహకవిగారు

తాము రచించిన "కామాక్షీ స్తుతి" ని మిక్కిలి యాసక్తితో నందందుఁజదివి యానందించితిని. "మున్నుడి" యెన్నఁదగియున్నది. ఈకలికాలమున వేదవిహితానుష్ఠాన సంపన్నుఁడవై యుండి తత్ప్రచారార్థమే గ్రంథరచన చేయుచుంట ప్రశంసనీయము. నీకృతికిఁ దగినభర్త దొరకుటయదృష్టము.

ఆ॥ సాటిలేనిధార మేటియౌపాండితి
దీటుగననికైత తేటతెనుఁగు
నేటికయ్య పెక్కుమాటలింక భమిడి
పాటి వంశతిలక ! లోటుఁగాన

శ్రీ చల్లపల్లి అప్పారావుగారు, అడ్వకేటు

ఉ॥ ఈశుభవేళ పైనధివసించి వెలుంగు సజీవచిత్ర సం
కాశ కళాభిరామ మదె గౌరవనీయ భవత్సుజీవనా
దేశముపూరుషోత్తమముదివ్యము నాపితృపూజ్యరూపమ
హ్లాశిషము ల్వెసన్ గురియనాప్తసఖా! నమితవ్యమయ్యెడిన్

మ॥ పితృవాక్యాదరణైకదీక్షితులరై వృత్తిప్రదాన్యాంగ్లి కో
న్నత విద్యాభ్యసనంబుమాని గడపన్ దాఁటందలంపూన కే
సతతశ్రీయుత సంస్కృతాంధ్రకవితా సంపద్యశఃపూర్ణ జీ
వితముల్ శ్రోత్రియనిష్ఠగూర్తురదెమీ విస్ఫారభాగ్యంబహో

ఉ॥ భర్తలు మీరలీవఱకె వహ్నిదెసన్ గయికొన్న సాధ్వికిన్
భర్తలయాచితాగత రమామణికిన్ శివకృద్విభూతికిన్
భర్తలు కీర్తికాంత కిలభర్తలునై తిరిగాని దక్షిణా
మూర్తివరేణ్య సత్కృతి విభుత్వము రానికతమ్మదేమనన్

చ॥ వచ్చి వయస్థలిందఱు సపత్నులతోడ మెలంగనేర్తునే?
నచ్చుదునా ననందలకు? నవ్వుదురేమొకొ నాగరుల్ ననున్!
'మెచ్చునెమానముద్రితనిమీలితనేత్రుఁడు ప్రేమకాఁ' డటం
చచ్చపుభక్తి కావ్యసతి యాగెను. నెచ్చెలి! కాదటందురా?

శా॥ "కామాక్షీస్తుతి" పైననేఁటికిఁగటాక్షంబున్ బ్రసారించినా
శ్రీమాయావతిఁగూడి మీరిఁకను బ్రహ్మానందమున్ బొందుఁడో

స్వామీ ! ధన్యము కన్యదాతజని మీ జామాతృతన్ శిష్యుఁడే
తా మామయ్యెఁగదా బళారె ! విపరీతం బొందు లేదీకలిన్

"ఉభయకవిమిత్ర" "ప్రతిభారవి" 'కవితాకలానిధి'
శ్రీభువనగిరి విజయరామకవిగారు

ఉ॥ శ్రీగిరిజాధిరాజ గురుసిద్ధిపదంబుగ మంగళాస్పదం
బౌ "గురుదత్త సౌధము"న నాపురుషోత్తముతృప్తిగాఁగవి
త్యాగమ యోగిశేఖరులదా కృతిపూరణ ధారణక్రియో
ద్యోగముకర్తృభర్తృముదముబ్బఁగ శ్రోత్రసుఖంబుఁగూర్చుతన్

శా॥ నాదెళ్లాన్వయ వార్ధిశీతకిరణా నాన్న న్నినుంగూడె వా
ణీదివ్యాంగన యౌవనోద్భవమునందే నేఁడె నిన్ జేర్చునా
తోన్నదంతంబెటులా? యథార్థమవధానోద్యోగసమ్మాన వే
ళాదాంపత్యముజ్ఞప్తి లేదె! కృతివాల్లభ్యంబులెన్నయ్యెనో!

మ॥ ఒకచోఁ జెల్లెలు తద్గురుప్రభవ మైయొండొక్కచోఁ గూఁతు నీ
స్వకపోలోద్భవయైమతొక్కటనగున్ జాయాస్వరూపాత్మశి
ష్యకృతిప్రాప్తి నిఁకేమన న్బహుళరూపావేశయౌవాణి నా
టకము ల్చిత్రము లాత్మమోహకకవాటమ్ముల్గదా పోల్చినన్

మ॥ పడే మాబోంట్లకె నిన్నుఁబోలిన స్థితప్రజ్ఞాళి నల్లేరుపై
వడిగాఁబోయెడు బండిగా నిహపరావర్తంబు సాధించి సం
బడమా సంచిత ముజ్జగించి మెయినిల్వంగూడఁ జిత్సజ్జడా
జడ మాయన్విశసించి పొందెదరుగా సౌఖ్యప్రదానందమున్

శా॥ తా నాదెళ్ల కులోద్భవుండయిన మేధాదక్షిణామూర్తి నా
కై నాఁ డేనలభారవిం దెలుఁగు సేయం గొన్నకాలంబునం"

దానాఁ డాదిగ వీరిమూలమున నా కయ్యెంబరోక్షంబుగా
నైనన్ శ్రీవర పైఁడిపాటికవితో నాప్తాదృతు ల్లేఖలన్

ఉ॥ అల్లపురాణముల్ ప్రణికి యాదటమిా ఆ'బ్రసన్న రాఘవం'
బల్లి ప్రసిద్ధ "శంరజయంబు" నుపాయ ముపాయనంబుగాఁ
గొల్లలుగొట్టియా "లహరి"కోనలగానముతానమాడి యు
త్ఫుల్లత రానువాదఘురిఁ బొందెనితండుకవీంద్రమాత్రుఁడే!

మ॥ పటిమల్వర్ధిల బైఁడిపాటికుల సుబ్రహ్మణ్యశర్మాభిధుం
డెటు నా కావ్యకుమారి ప్రౌఢయవునం చే తేరుచుండంగ నం
తట దిద్దుల్పచరించు నాస్థమెయి మేధాదక్షిణామూర్తి యె
ప్పటికైనం దనకా మెయేవధువునా న్ప్రాప్తించెనాకోరికల్

మ॥ సుర భాషాకవిశ్రేష్ఠసద్గురుఁ డెసూస్తోత్రార్హుఁడంటూనమా
వర కావ్యాద్యనువాదశీలికవియున్వర్ణ్యుం డెయాఁజూ! శతో
త్తర కావ్యాకలనావిమర్శల సముత్కర్షన్ గొనెంజూ కృతీ
శ్వరుఁడిందందఱునంద జేఘనయశో భాగ్యాఢ్యులెందుంగృతుల్

ఉ॥ కర్తయుఁగర్మభోక్తయయి కైప్రులముంచుఁబరాత్మయీకృతిన్
గర్తను భర్తనుం దనకుఁగా వెలయించె నితోధికంబుగా
వర్తన ముచ్చతన్నిగుడ వారలచే ఫలియింపఁజేసి త
త్కీర్తి నిజుబ్బఁజూఱఁగొని తేర్చుతనాంధ్రకవిత్వతత్త్వమున్

'కవిపండిత, హరిదాసహంస' శ్రీపాతూరి మధుసూదనరావుగారు

శ్లో॥ కర్తా భర్తాచ శ్రీకావ్యకామాక్షీప్రియ దర్శనా
సుబ్రహ్మణ్యః ప్రియచ్ఛాత్రో ద్వితీయో గురుదక్షిణః

తత్ప్రస్తుత్య ఏవోత్సవః సమ్మానరూపః స్వరూపతః ప్రభవతి. విద్వత్కవి శేఖర స్తత్రభవాన్ శ్రీ శ్రీ శ్రీ నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రివిశ్రుతచరస్స్వయమద్య కర్తాఽపి భర్తా భవతీతి నైతచ్చిత్రం యతః "యోబిభర్తి జగత్త్సైవ కర్తా భిన్న ఇవ శ్రుతః" ఇత్యభిజ్ఞ వచన మనుసృత్య శిష్య హృదయే విద్యారూపేణ స్వయంప్రవిశ్య పునరద్య గురురూపేణ భిన్న ఇవ పరిగృహ్ణాతి 'శ్రీకామాక్షీ స్తుతి' కృతిం కావ్య కర్తృభర్తారౌ హృదయపూర్వకం సంస్తుత్యమన్యే ధన్యోఽహమపీతి.

'శ్రీసరస్వతీపుత్ర' శ్రీపుట్టపర్తి నారాయణాచార్యులుగారు

తమరు దయతో పంపిన 'శ్రీకామాక్షీస్తుతి' ని చూచితిని. రచన చాల వ్యుత్పన్నమైనది. తమరుచక్కని విద్వాంసులు ఇఁక నేలోపముండును?

శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు-వాల్తేరు

తమ 'కామాక్షీస్తుతి'ని బఠించి ప్రమోదభరితుండనైతిని. చక్కని యాంధ్రీకరణము, ప్రౌఢమయిన కవిత్వము, పారాయణయోగ్యమైన గ్రంథము. ఈకృతిని 'పుంభావసరస్వతుఁ' వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రిగారికి సమర్పించుట శ్రీమేధా దక్షిణామూర్తికి సమర్పించుటయే కృతికర్త, కృతిభర్త లిరువురకు నాహృదయపూర్వకాభివందనములు.

### శ్రీ ప్రతాప హనుమచ్ఛాస్త్రిగారు

సచ్చిదానందరూప రసానుభూతి స్వరూపిణి యగు "శ్రీ కామాక్షీ స్తుతి" పంచశతికి రచింపఁబడిన యాంధ్రాను వాదము చిద్వినోదముఁ బండితకవీంద్రానుమోదము బ్రహ్మవిత్ప్రమోదముం గూర్చు సదాచారసమేత సత్సంప్రదాయ మని నాయభిప్రాయము.

శా॥ తమ్ము ల్కమ్మనివాసనల్ విబుధచిత్తాళి ప్రధానప్రమో
దమ్ముల్గ్రమ్మఁ గృతుల్ప్రసర్పసరసోత్పన్న ప్రభావాగ్రజుల్
సమ్మోద్వాంతులు స్వీయనిర్మల మనోబ్జాతామృతానందస
త్వమ్మున్మోదకులందఁ బంచెదరు మేధాదక్షిణామూర్తులై

మ॥ హనుమన్నాముని రామచంద్రయతివర్యాబ్జాంఘ్రిమాధుర్యచే
తనునిన్ బ్రహ్మవిదగ్రగణ్యుఁడగు మేధాదక్షిణామూర్తిన
న్ననుజు న్గాఁగ ననుగ్రహించుట నుధన్యాత్ముండ నేనంచులో
ననుమానంబొకయింత లేక మెలఁగ న్న్యాయంబ కా నాకిఁకన్

క॥ కృతికర్తకుఁ గృతిభర్తకుఁ
గృతికి విధేయుండనగుచుఁ గేల్మోగిచి నమ
శ్శతములఁ బ్రార్థించెద శా
శ్వతులుగ నిలఁ జెలఁగి మెలఁగ సర్వేశకృపన్

'కవిశేఖర' గురుజాడ రాఘవశర్మగారు

నాదెళ్లాన్వయ పూరుషోత్తమ కవీంద్రస్తుత్య పుత్త్రుండు వి
ద్యాదాతృత్వము గల్గు దేశికుఁడు శిష్టాచారసంపన్న మే
ధాదర్శోన్నత సత్కవీంద్రుఁడగు 'మేధాదక్షిణామూర్తి' సం
పాదింపం గృతికన్యకుం బతిగ సుబ్రహ్మణ్య ! ధన్యుండ

సీ॥ రచియించినావు 'కూర్మపురాణము'న్ ధర్మ
సారమున్ లోకోపకారకముగ
పలికితి ముద్దుపల్కుల 'శంకరవిజయ
ము'న్ ధరజ్ఞానప్రబోధకముగ
వ్రాసితివి 'ప్రసన్న రాఘవము'న్ విశ్వ
విద్యాలయమ్ము దా వినుతిసేయ
అనువదించితి తెల్గునను 'మూకకవిపంచ
శతి' భక్తిపారవశ్యము చెలంగ
వేదశాస్త్రపురాణసంవేది ! స్మార్త
కర్మదీక్షాకలిత దేశికప్రశస్త
పాదసేవానురక్త శ్రీభమిడిపాటి
సత్కులాంభోధిచంద్ర ! యోసత్కవీంద్ర !

మూకకవీంద్రుఁడై శతకము వ్రాలికెఁ స్థిరభక్తినైదు న
స్తోకమనీషులు న్మిగులఁజోద్యముగాఁ గయిసేయ వీని నాం
ధ్రీకరణంబొనర్చి కడు నేరుపుతోడను భక్తిమీఱఁగా
నైకవిసత్త్వముండా వెలయించెఁ గృతి న్గురుమూర్తి కిచ్చియుఁ
ప.
త్పృదుశయ్యాన్వితమైయొకప్డు నడచున్ శృంగారముంజిల్కు మే
ష్పదముల్ హాయిఁగదల్చుచున్బలుకుఁగావ్యంగ్యమ్ముగాగుహ్యమై
క్షప్తసంధుల్వీడరాని క్లిష్టత నడంపంబల్కఁగా గీర్తిసం
ష్ఠానై నిల్చును నీదుకావ్యసుత సుబ్రహ్మణ్య యజ్వేయెడన్

షష్టిపూర్త్యుత్సవము నేఁడుసల్పుకొంటి
కృతిసమర్పణఁ జేసిపండితులమ్రోల
గురునియాశీర్వచనముఁ గైకొంటివీవు
మాన్యచరిత సుబ్రహ్మణ్య! ధన్యతయిదె.

"చతుశ్శాస్త్రకోవిద" శ్రీ చివుకుల వేంకటరమణశాస్త్రిగారు

సుధీమణీ! "శ్రీకామాక్షీస్తుతి" నామూలాగ్రముగ పఠించి పరమానందభరితుఁడనైతిని. మూకమహాకవిని వాచాలునిగా నొనర్చిన యాపరదేవతామతల్లియొక్క సంపూర్ణానుగ్రహము మీపై ప్రసరించియున్నట్లు మీగ్రంథమందలి ప్రతి పద్యమును ఋజువుచేయుచున్నది. పఠించుసమయమున పాఠకుల హృదయమే పరదేవతామయమగుచుండ తద్రచయితలు తద్భావభావితులై యుందురని వేరుగా చెప్పవలయునా? ... పరదేవత మీకితోధిక విద్యాఫలమునిచ్చుగాకయని ప్రార్థింతు.

శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావుగారు, M.A.L.T. రిటైర్డు ప్రిన్సిపల్

సౌజన్యనిధీ! పండితోత్తమా!

మీకు కృతిసమర్పణము జరుగుట కడుముదావహము. మీది పండితకుటుంబము. సాంప్రదాయాను సారముగా మీరు అపారమైన విద్య సంపాదించుటయేకాక మృదుమధుర మనోహరములగు గ్రంథరాజములను రచించి ఖ్యాతి సంపాదించియున్నారు. ఆదర్శప్రాయమగు జీవితమును జరుపుకొనుచున్న మిమ్ములనుజూచి నేను గర్వపడుచున్నాను. మీతల్లి గారిమైత్రి నేను మఱువజాలను. భగవానుఁడుమీకు దీర్ఘాయువును, యశస్సును ప్రసాదించుగాత!

శ్రీ చింతగుంట సూర్యనారాయణరావుగారు 'మేఘదూతాంధ్రీకర్త'

శ్రీ మూకమహాకవి వాగమృతమును మీరాంధ్రసువర్ణ చషకములోఁ బ్రసాదించి ఉభయభాషాసేవఁ జేసినారు. ఆంధ్రావళి యాదరమునకిది పాత్రమై సతము మనుఁగాత! శ్రీ మేధాదక్షిణామూర్తి శాస్త్రులవా రుద్దండపండితులు. నిరంతర కవితాకళోపాసకులు, పవిత్రచరిత్రులు, నస్మద్గురుస్వరూపులును, వీరు పరమేశ్వరతుల్యులు. ఇట్టివీరిని మీకు కృతిభర్తగాఁ జేర్కొనుటయందలి ఔచిత్యము నేనెక్కువగా నొక్కి చెప్పవలసిన పనిలేదు.

శ్రీ అప్పల వేంకటరావుగారు, పౌరాణికులు

మీరనువదించిన "శ్రీ కామాక్షీస్తుతి"ని, సమూలముగాఁ జదివి సంతసించితిని గౌణార్థముగా నీకృతి కన్యయైనదిగాని ఆజిగిబిగి ప్రౌఢములైననడకలు భావగాంభీర్యమును జూడఁగా సర్వశక్తిమంతురాలౌ కామినిగానే యెన్నఁదగియున్నది. కావుననే మానవ కాలమాన ప్రమాణముగా వయసుమీఱినను స్వాధీనకృతమహాకాలస్వరూపులు శ్రీ మేధాదక్షిణామూర్తులనే వరింపనేర్పడుటలో మీకుఁ గృతకృత్యత స్థైర్యవిధాల నబ్బినదని భావించుచున్నాఁడను. ఇప్పుడిచ్చోట శ్రీమద్వాల్మీకి రామాయణపురాణకాలక్షేపమును నెఱపు[illegible]న్న రాణ్మహేంద్రపుర వాస్తవ్యులు బ్ర॥ శ్రీ॥ చిఱ్ఱావూరి [illegible]గతపద్మనాభ శాస్త్రిగారును మీగ్రంథమును జదివి మిక్కిలి [illegible]ందించి వారియభినందనములు మీకందింపుమని సెలవి[illegible]చే నిట్లు తెలుపుచున్నాఁడను.

# కృతిసమర్పణ సభావేదిక



ఎడమ నుండి :

(1) శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తిశాస్త్రిగారు.
(2) శ్రీ జి. వరదాచార్యులుగారు.
(3) శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు.
(4) శ్రీ భమిడిపాటి వెంకటసుబ్రహ్మణ్యశర్మగారు.

# కృతిసమర్పణోత్సవము

(గ్రంథకర్తృహస్తమునుండి కృతిభర్తగారి పుత్రులైన శ్రీనాదెళ్ళకృష్ణ శాస్త్రి యం. పురుషోత్తమశాస్త్రి యం. సుబ్రహ్మణ్యశాస్త్రిగార్ల పూనికతో బందరు జగన్నాథపురమునందలి వారి 'శ్రీగురుదత్తసౌధము'నందు శ్రీవికారి సం॥ శ్రావణ బ॥ ఆదివారము (ది.౨౩-౮-౫౯) సాయంకాలము ౪ గంటలనుండి జరిగినవివరము)

అసలేవర్షర్తువు విధీపిరామంలేకుండా వర్షాలుకురుస్తూనేవున్నాయి. అయినప్పటికి మాఆహ్వానాలు అందుకున్న బంధుమిత్రులు అన్యగ్రామాలనుండి ఒకరొకరేదిగుతున్నారు. శనివారంరాత్రిట్రెయిన్‌లో సభారంభకులైన "ఉభయభాషాప్రవీణ, వేదాంతపారీణ, కవిశేఖర" శ్రీమిన్నికంటి గురునాథశర్మగారుకూడా గుంటూరునుండి దయచేశారు. మాకు తోడ్పడవచ్చిన మాతండ్రిగారిశిష్యప్రశిష్యులు మామిత్రులు మున్నగువారు మాకిందు తోడ్పడవచ్చారు. పైన ఆవర్షంలోపల మేముచేస్తున్నసన్నాహాలు చూచి అంతా తెల్లబోతున్నారు. ఏమైనాసరే దైవసమానులైన మానాయనగారు నిర్ణయించిన ముహూర్తం నిర్విఘ్నముగా సాగితీరవలసిందే అన్న నాదృఢవిశ్వాసంతోనే పనులుసాగించాను. శ్రీమిన్నికంటి కవిశేఖరులు మానాయనగారు ఒకరినొకరు చూచుకొన్నది ఆవేళనేకాబట్టి తెల్లవారుజామువరకు వారికవితాగోష్ఠులలో మునిగి పోయారు. మిగిలిన మేమందరం తోరణాలు అలంకారాలు మొదలైన సన్నాహాలతోనే భళ్ళునతెల్లవార్చాము.

క్యాలెండరుమీద ఆదివారము 23 అంకెలు కనిపిస్తు న్నాయి. గ్రామాంతరాలనుండి రావలసినవారు క్రమంగాదిగు తున్నారు. గడియారము చిన్నముల్లు 9 మీదవుంది. పెద్దముల్లు 12 దాటింది. మానాయనగారి అనుష్ఠానమయి సావిడిలోకివచ్చి వారిపడకకుర్చీలో వారుకూర్చున్నారు. కవిపండితబృందము వారిచుట్టూచేరారు, వారువ్రాసిన 'ఆత్రేయశ్రోత్రానందము" లోని సంస్కృతశ్లోకాలుచదువుతూ వారుకాలక్షేపం చేస్తు న్నారు. గుంటూరునుండి "మహోపాధ్యాయ" శ్రీజమ్ముల మడక మాధవరామశర్మగారు శ్రీఘనకుధరం వేంకటాచారిగారు కవితాభిమానులు మఱికొందఱుదిగేరు. ఆవేళకే గ్రన్థకర్త తన బంధుమిత్రులు వెంటరాగావచ్చి, సరాసరి వెళ్ళిగురుమూర్తులకు సాష్టాంగనమస్కారముచేశారు. ఆభక్తికి వారియెడలగురువుల ప్రేమకు అక్కడకూర్చున్నవారంతా ఆశ్చర్యానందాలుపొం దుతున్నారు, అప్పుడే విచ్చిన గులాబులను గుబురుగా ఫ్లవర్ వేజ్ లో నేనుసర్దుతున్నాను.

అప్పుడు పెండ్లిసందడి మాయింట్లో తాండవిస్తోంది. ఎటుచూచినా కళకళలాడుతోంది, మాతో సహకరించేవారు మిత్రులు, అతిథులు, అందఱుభోజనాలుముగించారు. అప్పటికి 2 గంటలైంది. కారుమబ్బు ఆకాశంలో మూసుకొనివచ్చింది. వర్షంజోరుగాపడింది.అంతలోఆగిఎండవచ్చింది మళ్ళీజల్లుపడ్డది. వుండుండి జల్లుపడుతూనేవుంది. 4గంటలైంది. అప్పటికే ఆహ్వా

నితులు వొకరి వెంటవొకరువస్తున్నారు. మాతమ్ముడుఅధ్యక్షత వహించవలసిన 'చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీఎస్. టి. జి. వరదాచార్యులవారిని తీసుకొనిరావడానికి కారుతీసుకొనివెళ్ళేడు. వీధిగేటుముందరవారి రాకకు వచ్చేఅతిథులకు స్వాగతం చెప్పడానికి నిలబడి వున్నాను. 'శ్రీగురుదత్తసౌధ' శిఖరాగ్రంలో అమర్చబడ్డ మైకుద్వారా మంగళవాద్యం శుభప్రదమైన సమావేశాన్ని సూచిస్తోంది.

గేటుదిమ్మలకు ఇరువైపులా పాతబడ్డబాదులు ఆబాదులకు చుట్టబడ్డ రంగురంగుల కాగితాలపీలికలు పైన చివరగా అమర్చికట్టిన బోర్డు ఆబోర్డుమీద వ్రాయబడ్డ 'కృతిసమర్పణోత్సవము స్వాగతము' అన్న తళుకుచల్లిన అక్షరాలు ఆ బోర్డునుండి మేడచివరిభాగానికి క్రిక్కిరిసిన మామిడితోరణాలతో రంగురంగుల కాగితాల జిలిబిలిఅల్లికలతో రమణీయంగావుంది. కృతిభర్తయందలి గురుభావంతో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తదితర కవిపండితులు మాననీయులుపలువురు విచ్చేశారు.

ఇంతలో కారుహారన్ మోగింది. ఆచార్యులవారు కారునుండి దిగటానికి కారుతలుపు తెరిచాను. లోనికి దారిచూపాను. అతిథులకు స్వాగతంచెప్పడానికి మాసోదరసమానులైన అద్దేపల్లిశివరామయ్యగారు నిలిచివున్నారు. సావిట్లోకి వెళ్ళేము. అక్కడగుమ్మంపక్కనే డ్రాయరు ఆడ్రాయరుమీద

ఎఱ్ఱటిగుడ్డ, పొగలువిరజిమ్మే అగరువత్తులధూపం ఆపక్కగా వెండిబుట్టలో అమర్చిన కిళ్ళీలు, చక్రకేళీలు, బత్తాయిలు, పూలగుత్తులు, మరొకపక్క వెండిపళ్ళెంలో గంధపుగిన్నె పన్నీరుబుడ్డి కుంకుమబరిణె అందంగా అమర్చబడివున్నాయి. ఆముందు మా అన్నయ్యగారి జ్యేష్ఠపుత్రుడు మానాయనగారి పేరుపెట్టుకోబడ్డవాడు వినయంగా నిలబడివున్నాడు. ఆసావిట్లో మధ్యగా ఒకచాప ఆచాపమధ్యలో గుండ్రటిబల్ల ఆబల్లమీద టేబుల్ గుడ్డ దానిపైన ఫ్లవర్ వేజ్ అందులో తీర్చిదిద్ది అలంక రించిన పూలగుత్తులు ఆహ్లాదంగొల్పుతున్నాయి. ఆగుండ్రటి బల్లకునలువైపులా అమర్చిన అందమైనకుర్చీలు నాల్గవవైపున మానాన్నగారుకూర్చునే కేన్ చైరు వున్నాయి.

నేను ఆచార్యులవారిని వెంటతీసికొని కుడివైపుగదికి మలుపుతిరగగానే మరొకయిద్దరు వచ్చేవారికి పైకి దారిచూపడానికి అక్కడ సిద్ధంగావున్నారు. పై వరండాలో అడుగుపెట్టగానే యింకొకరు ఆపై మెట్లకు దారిచూపుతున్నారు. అవి ఎక్కితే చేతులుపైకిచూపుతూ మరొకరు సిద్ధంగావున్నారు. శివఅంతస్తుమీద అడుగుపెట్టేటప్పటికి మాఅన్నగారు నమస్కారంచేస్తూ వేదికవైపు దారిచూపారు.

ఆమూడవఅంతస్తులో ముందుప్రొజెక్షన్ భాగంలో వేదిక నిర్మించబడివుంది. మామిడితోరణాలతో రంగురంగుల కాగితాలతో వివిధములయిన దండలతో అందంగా అలంక

రించబడ్డ వేదిక. ఆవేదికపై పరిచినతివాచి. ఆతివాచీపై
ముందుగామూడు; డస్కులు ఆడస్కులమీద రంగురంగుల
కొత్తగుడ్డలు. వేదిక వెనుక భాగాన ఎజ్జిబిటిస్క్రీను ఆస్క్రీనుకు
జిగేలునమెరిసే చమ్కీబారులు జారవిడిచి వున్నాయి.
ఆస్క్రీనుకుమధ్యగా మహనీయులైన కీర్తిశేషులు మా పితా
మహుల ఫోటో అమర్చబడివుంది. ఆక్రిందనే చిన్నటీపాయ్
మీద శివపార్వతీవిగ్రహము; వేదికముందు భాగము రెండు స్తం
భాలకు కొబ్బరిమట్టలఅల్లిక ఆ అల్లికపైన ఇటూఅటూ కట్టిన
అరటిపిలకలు రెండిటిఆకులూ పైనకలిసి ఆర్చిగా అందం
చేకూర్చాయి. ఆఅరటిమొక్కలచాటున దేదీప్యమానంగా
వెలుగొందే రెండువిద్యుద్దీపాలు, ఆమండపాన్ని కలకలలాడి
స్తున్నాయి. వేదికముందు ఇరువైపులా రెండుటీపాయ్‌లు, ఆ
టీపాయ్‌లమీద, రెండుఫ్లవర్ వేజులు. ఆఫ్లవర్ వేజుల్లో అప్పుడే
విచ్చిన రంగురంగులపూలు సంబరపడుతున్నట్లున్నాయి. ఈ
రెండుటీపాయ్‌లమధ్య వొకకార్నర్ టీపాయి. ఆటీపాయిమీద
చక్కగాఅలంకరింపబడ్డ "కామాక్షీ స్తుతికన్య". అంతకుముందు
వొకటీపాయి. ఆటీపాయిమీద అగరువత్తులుపెట్టిన గాజు
కుండీ పొగలువిరజిమ్మే ఆవత్తులు గుప్పునపరిమళాన్ని విరజిమ్ము
తున్నాయి. ఆవేదికకు ఎదురుగాను, ప్రక్కగాను, పఱచిన
పెద్దజంపకానాలు. ఆ జంపకానాలుమీదకిక్కిరిసికూర్చున్న
సభాసదులు. వారిమధ్యనుండి ఆచార్యవర్యులు, కృతిభర్త
వారివెంట కృతికర్త దారిచేసికొని నడిచారు. ఆవెంట నేనూ

వెళ్ళి మైకుముందు నిలబడ్డాను. ఎలుగెత్తిపలికే వేదవాక్కులు అంతంకాగానే శ్రీ ఆచార్యవర్యులను, అధ్యక్షపీఠాన్ని అధిష్ఠించవలసిందిగా వినతిచేసికొన్నాను. సభికులు చప్పట్లుచరిచారు. మా అగ్రజుడు వారికి పూలమాలవేశాడు. అప్పుడు అధ్యక్షులవారి ఆహ్వానంపై కృతిభర్త - కృతికర్తలు వారికి ఇరువైపులా వేదికపై ఆసీనులవడానికిముందు అంతకుముందే అలంకరించబడివున్న మాపితామహుల ఛాయాచిత్రానికి అభిముఖంగా చేతులుజోడించినిలిచి కనులుమూసికొని ధ్యానం చేసి గద్దెమీద ఆసీనులయ్యారు. మాఅన్నగారు వారినిపుష్పమాలాలంకృతుల జేశారు. సభికులు చప్పట్లుచరిచారు. కృతిభర్త పైన తనమామూలు అంగవస్త్రంతోనే ఆవేదికపై ఆసీనులైనా, పెండ్లికొడుకులాగానే ప్రకాశిస్తున్నారు. సహజమైన వినయసంపత్తితోటి ఆకృతికర్తఅన్ననో, కన్యాదాత లక్షణాలు పూర్తిగా పుంజీభవించినరీతిగా వంగివంగికూర్చున్నాడు. నారీమణులు నాల్గవఅంతస్తుమీద క్రిక్కిరిసివున్నారు.

చిచ్చులకన్ను మూసికొని చేతిత్రిశూలముడాంచి యేన్గుతోల్
పచ్చడమున్ గొబన్ వదలి వచ్చినయీశుఁ డితండుకానిచో
నిచ్చటఁ బార్వతీసతియు నీమువురాత్మజు లీసునామమె
ట్లచ్చుపడున్? భవన్మనములందు విచారణ చేసిచూడుఁడా?
'కామాక్షీస్తుతిఁ' జూచినారుగద గంగాదేవి తాఁగానిచో
నీమూన్యుండు తలన్ ధరించునటె! యందేపారునే శుద్ధతా
వ్యామిశ్రామృతధార పావనత సుబ్రహ్మణ్యజన్యత్వ మిం
కామాధుర్యము దేనికున్నయది? పాపాళిం బ్రభంజించుటో

అని శ్రీ మిన్నికంటికవిశేఖరులు కృతిభర్తలయిన శ్రీ మేధా దక్షిణామూర్తులనుగూర్చి చమత్కారంగా అభివర్ణిస్తూ సభాప్రారంభముచేసి తమ 'మున్నుడి'లోని కొన్నిభాగాలు చదివేరు. ఆపైన గ్రంథకర్తగారి షష్టిపూర్తిప్రసక్తిగా మానాయనగారు తమ ఆశీస్సులను పద్యరూపంగా ఆ తమ శిష్యులకు అందిస్తూ నూతనవస్త్రాలూ కాశ్మీరుశాలువా వారి పైన కప్పేరు. వెంటనే స్రక్చందనతాంబూలాదులతో కృతి సమర్పణ చేయవచ్చినఆశిష్యాగ్రగణ్యుడుగురుపాదాలంటుతూ ఆనందబాష్పాలతో పాద్యం అర్పించాడు. ఆగురుపాదాల మీాదనుండి ఎంతకు శీర్షం ఎత్తకున్న ఆకృతికర్తను ఆప్రక్కనే వున్న నేను భుజంతట్టి బుజ్జగించి లేవదీసి సభాభిముఖంగా వేయబడ్డకుర్చీలో కూర్చోబెట్టాను. అంతట వారు కనులుతు డుచుకొని తమ 'కామాక్షీస్తుతి'లోని పద్యాలను శ్రావ్యంగా వినిపిస్తున్నసమయానికి సంధ్యాకాలమైంది. అధ్యక్షుల అనుమ తినందిన మానాయనగారువారినియమమును పాటించుకొను టకై కిందికివెళ్ళారు. స్నానసంధ్యావందనాలు వేగంగానే కాని చ్చుకొని తిరిగివచ్చి 'కృతిస్వీకృతి' సందర్భంగా వ్రాయబడ్డ తమపద్యాలుచదివి కృతికర్తకు రూ116 లుకానుకగా సమర్పిం చారు. ఆపైన దేశము నాల్గుచెఱగులనుండివచ్చిన ఆశీస్సులు అభినందనాలు చదివించబడ్డతరువాత శ్రీసర్వా వెంకటశేషయ్య గారు శ్రీజమ్ములమడక మాధవరామశర్మగారు, శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీప్రవ్యాడ శేషగిరిరావుగారు, శ్రీగురు జాడ రాఘవశర్మగారు, శ్రీమల్లంపల్లి వీరేశ్వరశర్మగారు, శ్రీ

అప్పటుపల్లి హనుమంత రావుగారు, శ్రీకాకాని నరసింహారావు గారుతమతమగంభీరోపన్యాసాలతోను,చదివినపద్యరత్నాలతో నునందలకొలదిగావున్న సభాసదుల్ని ముగ్ధుల్ని గావించారు.

అప్పటికే 9దాటి అరగంటఅయింది. యిక నేనులేచాను. మాపితామహులు నిర్మించిన కీర్తిసౌధానికి మాపితృపాదులు పైపై అంతస్తులు వేసిందేగాక "శ్రీగురుదత్తసౌధాన్ని" ఈవిధంగా సుస్థిరంచేసినతరువాత నాకుమిగిలిందల్లా స్వప్నసౌధ నిర్మాణమేకావటంచేత ఈకృతిసమర్పణాన్ని ఆధారంచేసుకొని నేనువ్రాసిముద్రింపించిన "కలనిజమైంది" అనే నాకల్పితశిల్పం సభికులముందు ప్రదర్శించాను. అధ్యక్షులయిన ఆచార్యులవారు సముచితంగా తుదిపలుకులు పలికారు. ఆఖరుకు నావందనాలు అర్పించటంలో "ఋతుధర్మాన్ని విస్మరించి మనపాలిటపడకుండా ఆగినఆవరుణదేవునికిన్నీ నాఅభివందనా"లంటూ నేను ముందేముద్రింపించిన ముక్కవున్నందుకు ఆమాటదక్కించిన భారంభంలోనే ఇంద్రధనుస్సు కనబడిచిన భాంతందాకా ఒక్కతుప్పరైనాపడకుండా మూడవఅంతస్తుమీద ఆరుబయటజరిగిన ఆమహాసభ నిర్విఘ్నంగాను ఎంతోవైభవంగాను జరిపినందుకు కదలకుండాకూర్చున్న ఆసభాసదులందరూ అత్యంతముగ్ధులయ్యారు. దైవజ్ఞనిర్ణీతమైన ముహూర్తబలం అంటే యిట్లాగేవుంటుందికదా అని నేననుకొన్నాను.

మధ్యమధ్యఫ్లేష్ బల్బులతో ఫోటోలు తీయబడ్డాయి. పదిగంటలైనా చివరవరకూ సభ నిండుగానేవుంది. సింహద్వా

రమువద్ద కాచివున్న మాతమ్ముడున్నూ మా అన్నకుమారుడు చిరంజీవి దక్షిణామూర్తినీ అతిథులను ఆపి అక్కడున్న కుర్చీలలో ఆసీనుల్ని చేసి చందన తాంబూలాదులు బత్తాయిలు చక్రికేళీలు పూలగుత్తులు నాచిరుపాత్రమున్నూ సమర్పించి సగౌరవంగా సాగనంపారు. అప్పటికే కాలాతీతం కావడం చేత ఉపన్యాసకులను మాతో సహకరించిన బంధుమిత్రాదులను మరి కొందఱు అతిథులను ఆపి విందు జరిపేము.

తెల్లవారింది అన్యగ్రామాగతులు తిరుగుముఖం పట్టేరు. అంతవఱకూ కళకళలాడే మాయిల్లు పెళ్ళిసందడి సన్నగిలి నాగవల్లికళ ఆవహించిన పెండ్లియింటిలా చిన్నపోయింది. జరిగిన మహోత్సవం మాత్రం వెండితెర మీద చిత్రంలా నా మనస్సులో చిత్రింపబడింది.

భవద్విధేయుడు
నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రి



# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨3 | ౬ | శ్వశ్వే | స్వశ్రే |
| ౨౮ | 2 | శ్వఁశ్వే | సుశ్రే |
| 1 | 13 | గొంతెత్తి | గొంతొత్తి |
| 4 | 6 | పెన్గచ | దోకచ |
| | 14 | సంతమస్ | మేచక |
| 5 | 2 | సేశత్త్వం | సేశత్వం |
| | 4 | నభోఖ్య | నభంబు |
| | 8 | చఁగ | కఁగ |
| | 13 | దుర్ఘరో | గాఢదు |
| | 14 | విషోద్ధ | విషోత్థ |
| | 16 | బొదంగ | బొందంగ |
| 6 | 15 | నీరు | నీర |
| 11 | 20 | యదుంగుఁగవ-పదద్వయము | |
| 13 | 6 | స్పుర | స్ఫుర |
| | 15 | చీన్యత | చీన్యము |
| 24 | 6 | జిందిర | జెందిర |
| 25 | 17 | పెన్గచ | పెన్కచ |
| 26 | 1 | పెన్గురు | పెన్కురు |
| 28 | 6 | జెంది | జెండి |
| 29 | 1 | డుండీర | దుండీర |
| 31 | 2 | గాంచీ | గాంచి |
| | 3 | సామీప్య | సంవీత |
| 32 | 11 | లేకఁగాం | లేకకాం |
| 33 | 18 | రమీయంపు | రుచిందేలు |
| | | బ్రివాళ | ప్రచార |
| 36 | 8 | సుతిలస్క | తిలకాంక |
| 37 | 11 | గాకఁగొం | గాకకొం |
| 43 | 1 | పెన్గ్రపా | పెన్క్రపా |
| | 10 | బాధము | బాధము |
| 51 | 3 | పెను | పటు |
| 51 | 10 | పెన్గ్రప | పెన్క్రప |
| | 11 | పృధు | పృథు |
| 56 | 7 | మదుపంబు | మధుపంబు |
| | 17 | పెన్గ్ర | తత్క్ర |
| 57 | 1 | పెన్దమః | పెత్తమః |
| | 10 | న్యాబషణం | న్యాభషణం |
| | 12 | బర్ధించు | బర్థించు |
| 58 | 18 | ఁబెన్దపో | సత్తపో |
| 64 | 19 | క్రధా | క్రిధా |
| 66 | 3 | సమేతమో | సమేతమా |
| | 11 | వాఖ్యా | వాధ్యా |
| | | ద్గ్రింధ | ద్గ్రింథ |
| 68 | 11 | నంచు | నంచ |
| | 13 | కౌమద్వం | కౌముద్వం |
| 70 | 2 | సద్విజ | సద్ద్విజ |
| | 19 | స్పేరింఖ | స్పేంఖ |
| 73 | 1 | పెన్గ్రపా | పెన్క్రపా |
| 77 | 11 | స్పీతి | స్ఫీతి |
| 78 | 7 | ద్యుతుల | ద్యుతుల |
| 79 | 16 | త్రపస్ప | త్రపిస్ప |
| 83 | 15 | వైపూర్ణ | వైఁబూర్ణ |
| 85 | 17 | నది | నవి |
| 92 | 2 | వయస్సు | వయసు |
| 95 | 13 | నమ్మన | నమ్మను |
| 96 | 14 | కాలినగ | కాలునఁగ |
| 97 | 6 | పెన్పూర్వ | ఘనపూర్వ |
| 101 | 20 | నదభ్రి | దయాబ్రి |
| | | న్యాబవింతు | శింగొల్తు |
| 107 | 16 | గురింజ | గురిజ |
| 109 | 13 | వెసఁగ | తెసఁగ |

మఱియుం గలవానిఁ జదువరులు సవరించుకొనఁగలరు.

రమువద్ద కాచివున్న మాతమ్ముడున్నూ మాఅన్నకుమారుడు చిరంజీవిదక్షిణామూర్తిన్నీ అతిథులనుఆపి అక్కడున్నకుర్చీలలో ఆసీనుల్నిచేసి చందనతాంబూలాదులు బత్తాయిలు చక్రికేళీలు పూలగుత్తులు నాచిరుపొత్తమున్నూ సమర్పించి సగౌరవంగా సాగనంపారు. అప్పటికే కాలాతీతంకావడంచేత ఉపన్యాసకులను మాతోసహకరించిన బంధుమిత్రాదులను మరి కొందఱుఅతిథులను ఆపి విందుజరిపేము.

తెల్లవారింది అన్యగ్రామాగతులు తిరుగుముఖంపట్టేరు. అంతవఱకూ కళకళలాడేమాయిల్లు పెళ్ళిసగదడిసన్నగిలి నాగవల్లికళ ఆవహించినపెండ్లియింటిలా చిన్నపోయింది. జరిగినమహోత్సవంమాత్రం వెండితెరమీదచిత్రంలా నామనస్సులో చిత్రింపబడింది.

భవద్విధేయుడు
నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రి



